

| | |
|---|---|
| పేరు | : వారణాసి సూర్యకుమారి |
| జననం | : 24-4-1941 |
| విద్యార్హతలు | : S.S.L.C. |
| జన్మ స్థలం | : ఏలూరు |
| స్వగ్రామం | : ద్రాక్షారామం |
| తల్లిదండ్రులు | : శ్రీ భాగవతి సుబ్బారావు, సత్యవతి |
| భర్త | : **శ్రీ వారణాసి లక్ష్మీజయప్రదన్**<br>(రిటైర్డ్ మేజర్, లెక్చరర్, పాలిటెక్నిక్ కాలేజి, మచిలీపట్నం) |
| సంతానం | : ఇద్దరు అమ్మాయిలు, ఇద్దరు అబ్బాయిలు<br>(అందరూ డాక్టరేట్స్) |
| మనుమలు | : ఇద్దరు |
| మనుమరాండ్రు | : నలుగురు |
| రచనలు | : గోవిందశతకము, శ్రీరామ కథా సుధ<br>ఇంకా అనేక కథానికలు, కవితలు,<br>పద్యాలు, అముద్రిత నవలలు |
| సేవా కార్యక్రమాలు | : వాకర్స్ అసోసియేషన్‌లో ప్రెసిడెంట్‌గా,<br>మహిళా మండలి వైస్ ప్రెసిడెంట్‌గా<br>ప్రస్తుతం ఇన్నర్ వీల్‌క్లబ్ ISOగా |
| విదేశాయానం | : అమెరికా పర్యటన 1996లోను,<br>2000 సం॥లోను చేసారు. |
| ప్రవృత్తి | : మృదు సంభాషణ, పరోపకారం, సహనం |

# సూర్యకిరణాలు



వారణాసి సూర్యకుమారి

# సూర్య కిరణాలు



వారణాసి సూర్యకుమారి



సాహితీ మిత్రులు
మచిలీపట్నం

# సూర్య కిరణాలు

కవితలు

రచన:
శ్రీమతి వారణాసి సూర్యకుమారి
21-562-3, పరాసుపేట,
మచిలీపట్నం - 521 001

హక్కులు కవయిత్రివి
ప్రచురణ జనవరి 2005

ప్రచురణ సంఖ్య - 33
వెల - 15 రూ.

## కృతజ్ఞతలు

శ్రీమతి వారణాసి సూర్యకుమారి కలం నుండి వెలువడిన కవితలు "సూర్యకిరణాలు". ఇవి ఏడు రంగుల కలయికలు. అట్లే సూర్యకుమారి గారి కవితలు వివిధ భావాల సమ్మేళనం. సూర్య కిరణాలలో కాంతి ముఖ్యమైనట్లే, సూర్య కుమారి కవిత్వంలో వారి అనుభూతి ప్రధానం. "సూర్యకిరణాలు" మచిలీపట్నం "సాహితీ మిత్రులు" సంస్థ ప్రచురణగా ప్రచురిస్తున్నందుకు వారికి కృతజ్ఞతలు

- డా॥ రావి రంగారావు, వ్యవస్థాపకులు

ప్రతులకు:
శ్రీమతి వారణాసి సూర్యకుమారి
21-562-3, పరాసుపేట, మచిలీపట్నం - 521 001
ఫోన్: 08672 - 251741

ముద్రణ
బందరు కళ్యాణి ప్రెస్, మచిలీపట్నం -1





## అంకితం

సీ॥ వ్యాసప్రతిష్ఠిత బాసర క్షేత్రమ్మ
జ్ఞాన సరస్వతి యాన గొనుము
కరుణించు కనుదోయి కాంతి పుంజమ్ముల
సమ్మోహన దరహాసమ్మ గనుము
విశ్వజనని మీటు విశ్వవిపంచియే
వాణి పాణిని వెల్గు వీణ గనుము
ఆ దర్శనము జేసి ఆదర్శముగ మారు
జనులను నమ్మి యా జనని గనుము

తే॥ గీ॥ జనుల కీ దేవి దీప్తియే జ్ఞాన ప్రదము
విద్య వినయ సంపత్తిని వెలుగజేయు
కాళిదాసు వాల్మీకాది కవులకిచ్చె
వరము ! అట్టి వాగ్దేవికి వందనమ్ము ॥

సదా మా యందు
కరుణారసం కురిపించు
సరస్వతీ దేవికి భక్తి ప్రపత్తులతో

-వారణాసి సూర్యకుమారి

# కల్పన

చల్లని తల్లి సరస్వతీ దేవి అనుగ్రహము వల్ల చిన్ననాటి నుంచే కల్పన - కవితలు హాబీలుగా అలవడినాయి. ఊహాకల్పనలకు వాస్తవికత జోడించి కథలు, నవలలు, కవితలు వ్రాయడం జరుగుతూండేది. ఛందోబద్ధమైన పద్య రచనకు పూనుకోవడం మొదలుపెట్టినాక 'శ్రీరామకథా సుధ' ను 2004లో పద్యకావ్యంగా రూపొందించడం జరిగింది. విజ్ఞుల ఆదరాభిమానములను అందుకొనుట కూడా జరిగింది. సహస్రావధాని శ్రీ గరికపాటి నరసింహారావు గారు పుస్తకావిష్కరణ చేసి తమ అమూల్యమైన అభినందనలు అందజేయడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

వివిధ సందర్భాలలో, అనేకానేక సంఘటనలు చూసి, విని, స్పందించి 'సూర్య కిరణాలు' అని ఈ కవితాసంపుటి వెలువరించడం జరిగింది. ఆయా పరిస్థితులు ప్రత్యక్షంగా వీక్షించినప్పుడు మనసు చిత్రమైన అనుభూతికి లోను కావడం సహజం. సంతోషం కానీ, విచారం కానీ, బాధ కానీ మన ప్రమేయం లేకుండానే కలుగుతాయి. అటువంటి సమయంలో ఉద్భవించినవే నా యీ కవితలు.

ఈ చిరు యత్నాన్ని జయప్రదం చేయుటకు శ్రీ డా॥ రావి రంగారావు గారు చక్కని సలహాలనిచ్చి ప్రోత్సహించారు. ఆయనకు సదా నా కృతజ్ఞతలు.

అందంగా 'పుస్తకం' మలిచిన 'కళ్యాణీ ప్రెస్' వారికి నా ధన్యవాదములు. ఈ పుస్తకం 'సాహితీ మిత్రులు' రజతోత్సవ సందర్భంగా అవిష్కరించడం నాకు చాలా సంతోషం, తృప్తి కలుగజేస్తోంది.

నా యీ 'సూర్య కిరణాలు' నలుమూలలకు ప్రసరించాలని ఆశిస్తున్నాను.

సాహిత్యాభిలాషులందరూ ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని అభిలషిస్తున్నాను.

రచయిత్రి : వారణాసి సూర్యకుమారి



# ఓం వినాయక

తే॥ గీ॥ వినగ రావ వినాయకా విన్నపములు !
భాగ్య మాయురారోగ్యముల్ భద్రతలును
శాంతి సౌఖ్యాలు గృహమందు సాగుచుండ
శుభములను గూర్చి చల్లగా చూడు మమ్ము ॥

విశ్వనాథు తనయ ! నీకు విన్నవింతు
సుఖము లందించు చుండుము శోభ లలర,
వేదనల తొలగించుము వేడ్కమీర,
శాంత హృదయము నందించు సరసహృదిని ॥

గండు కోయిలై కీర్తింప గళము లేదు
ప్రతి ఫలాపేక్ష లేనట్టి భక్తి లేదు
ప్రతి పరీక్షను నిలుచుండు బలము లేదు
ఐన నీదయకును లోటు కానరాదు ॥

# శివస్తుతి

సీ॥ అర్ధనారీశ్వర యడిగినది తడవు
వరము లిచ్చెడి భక్త వత్సలుడవు !
కాలకూట విషము కంఠము నందుంచి
అమృతము పంచితి వమరనాధ !
భూతిని దాల్చియు భూరి సంపదలిచ్చు
పన్నగ భూషణ । పశుపతి నిను
సేవించు వారల క్షేమము శంకర !
నీవె చూచుదువట నిక్కముగను

తే॥ గీ॥ భక్త కన్నప్ప భువి మూఢ భక్తుడైన
పాము సాలె పురుగు హస్తి పశువులైన
నీ దయకు పాత్రులైతిరి నిన్ను జేరి ॥
నిన్ను పొగడంగ శక్యమే నిశ్చలాత్మ !

2. శిరమున గంగను స్థిరముగ దాల్చియు
సగరు తనయులకు సహకరించె
ఆ భగీరథు తీవ్ర యత్నమునకు పొంగి
గంగ సొగంగను గంగ నంపె
జీవేశ । వారి సజీవుల జేసిన
భక్త సులభుడవు భాగ్యమగును
శివ శివ అన్నను శ్రీఘ్రగతిని నీదు
దర్శన భాగ్యము ధరణి పొంద

తే॥ గీ॥ ఓం నమశ్శివాయః యని ఒక్కసారి
శివుని భక్తిగా శ్రద్ధగా చిత్తమందు
ధ్యానమును జేయ బ్రతుకులు ధన్యమగును
కనికరించును వారిని కరుణ జూపి ॥



# బాసర సరస్వతి

1. భాసిలంగను భగవతి బాసరందు
భారతీ దివ్య దర్శన భాగ్యమయ్యె
జ్ఞాన సంపత్ప్రదాయిని జగతి వేలు
మాత విద్యా వినయములు మాకు నిమ్ము ॥

2. కోటి భాను ప్రకాశమ్ము కోమలమ్ము
దయను వర్షించి మెఱయు నేత్రద్వయమ్ము
వదనమందు ప్రసన్నత వరలు నమ్మ
భక్తులకు కల్పతరువైన శక్తివమ్మ ॥

3. భక్తుల కెపుడు నీపైనె భావనమ్ము
తమరి హృదయ మందిరమునె తలచియుంచు
హంస వాహన నీకు సింహాసనమ్ము
వారిజభవుని సతికృపన్ వరము నిమ్ము ॥

4. సతత పుస్తక ధారిణి సత్యవాణి
సకలలోక పూజిత సరస్వతివి ! మాత !
ధవళ వర్ణ శోభిత వరదాయిని నిను
నమ్మి గొల్తు వీణాపాణి నలువరాణి ॥

5. మిన్నయైనట్టి రచనల నెన్నగామ
ఉన్నపాటున నాచేత ఉత్తమముగ
వ్రాయ నేర్పుము వాగ్దేవి వాసిగాంచ
కృతి సమర్పణ నే చేసికొనెద నమ్మ ॥

# సూర్య కిరణాలు

సుప్రభాత వేళ సుమబాల
దరహాస వదన వికాసమ్ము
నీటి ముత్యముల ప్రకాశమ్ము
నిచ్చేవి సూర్య కిరణాలే ॥

పక్షుల కిలకిల రవములకును
సతత హరిత పత్ర శోభకును
పద్మమ్ములు వికసించుటకును
కారణము సూర్యకిరణాలే ॥

పుడమిని వర్షము కురియుటకును
అటవీ సంపద పెరుగుటకును
సకల ప్రాణులు జీవించుటకు
కారణము సూర్యకిరణాలే ॥

చీకట్లను పాఱద్రోలుచు
విశ్వమంతట వెలుగుజిమ్ముచు
మనలో అజ్ఞాన తిమిరమును
పోగొట్టేవి సూర్యకిరణాలె ॥



# స్వాగతం స్వభానూ! స్వాగతం

(ఆంధ్ర సారస్వత సమితి ఉగాది పోటీలో ప్రథమ విశిష్ట బహుమతి పొందిన కవిత)

సీ॥ స్వాగతమందుము సాదరమ్ముగ మేము
భానూదయమ్మౌ స్వభాను నీకు
నవవసంతాగమన శుభతరుణ మందు
సుఖముగ జనులుండ స్ఫూర్తి నిచ్చు
లేత మామిడి పిందెలేలు తరులు। నిండు
చూలాళ్ళువోలెను చూడ నొప్పు
విరియ బూసిన మల్లె విరులన్ని వెదజల్లు
పరిమళమ్ముల దేలు పవనములును

తే॥ గీ॥ గళములెత్తి యా గండు కోకిలల దండు
ఆమని మధుర భావనల్ ఆలపించు
పరవశంబున దేలును ప్రజలు నెపుడు
కనగ చర్వితచర్వణమ్మనగదగునె ॥

సీ॥ ప్రతియేటివలె గాక ప్రతిన బూనినయట్లు
అమెరికా ఈరాక్‌ను అనికి బిలిచె
సద్దాము బుష్షుల సమర శంఖధ్వని
సంకుల సమరమ్ము సాగుచుండె
అంబరమంటుచు నయ్యని జ్వాలలు
అణుబాంబు లన్నింటి నణచుచుండె
బిక్కు బిక్కుమనుచు భీతిగ జనులంత
విశ్వశాంతి కొఱకు వెదుకుచుండె

తే॥ గీ॥ యుద్ధరంగానలము। జూచి యునికి మరచి
మూగ బోయెనో కోకిలల్। పొగల సెగల
వాడిపోయెనో మల్లెలు। వానలేక
వనరు వేళ నేతెంచె స్వభాను నేడు

తే॥ గీ॥ పోరులేకుండ నందరు పొత్తు గల్గి
నవ వసంతాగమనవేళ నవ్యశోభ
వెల్లి విరియ స్వభాను నీవె తగుదువని
స్వాగతము బల్కుదుము నీకు సాదరముగ

# శ్రీరామ నవమి

రాంచీ 2004

సీ॥ శ్రీరామ నామము శ్రిత పారిజాతము
శ్రీరామ దర్శన శ్రేయ ప్రదము
సీతమ్మ కరములు సిరులొల్కు వరములు
సీతమ్మ చూపులు శీతలములు
సీత రాముల సేవ శీఘ్రమ్ము చేసిన
అభయమ్ము నిచ్చును ఉభయు లెపుడు
సత్య సంధుని కోరి సత్కార్యములు జేయ
సఫలమ్ము నొందును సకలజనులు

తే॥ గీ॥ రామ పాదుకలను సుస్థిరముగ నమ్మ
కోరికలు దీరు మనకున్న కోప ముడుగు
కనగ భక్తుల పాలిట కల్ప తరువు
రాముకన్న వేరొండు దైవమ్ము గలరె ॥

జగతి జనులకు కలిగించు జ్ఞాన మీవు
ప్రజల కెప్పుడు నందించు ప్రగతి నీవు
రమ్య జనజీవన రథ సారధివి నీవు
రక్ష నీకన్న లేరింక రామచంద్ర ॥



# 2000 మిలీనియం

U.S.A.

**Wish you all a happy new year.**

ఆనందం అర్ణవమంతై
ప్రణవనాదమే ప్రమోదంబై
ఎదలలో సుధలు నిండ
నెలవులు శుభంకరములై
ఆరంభమైంది నూతన శతాబ్ది ॥
ఎల్లరి కన్నుల జ్యోత్స్నలు వెలగాలి
నూతనోత్సాహం కలగాలి
క్రొత్త ఆశలు చిగురించి
కోరిన కోర్కెలు తీరాలి
ఈ మిలీనియం శ్రీమయం కావాలి
లక్ష్మీ । భారతి ఎంతో ప్రసన్నం కావాలి
సుఖమూ శాంతీ వెల్లి విరిసి
భావి జీవనం సుగమం కావాలి
ఆరంభమైంది నూతన శతాబ్ది
అందరూ పొందాలి ఎంతో లబ్ది

# గురజాడ జయంతి

సీ॥ గురజాడ గురజాడ వరమౌను మనకెల్ల
కథలకు కాణాచి కాదె ! వారు
ముత్యాల సరములు ముద్దుగా సృజియించి
కలకాలము నిలిచె గాదె ! వారు
పుత్తడి బొమ్మను పూర్ణమ్మ నందించి
కవితా ప్రతిభ చాటె గాదె వారు
ఆ గిరీశమును కన్యాశుల్క మందించి
ఘనకీర్తి నొందిరి గాదె వారు

తే॥ గీ॥ బహుముఖ ప్రజ్ఞ, పాండితీ పాటవమ్ము
కల్గి రచనలో నవ్యత కలుగజేసి
చదువరి మనసు దోచెడు చతుర కవులు
వారిని సదా స్మరించంగ వలెను మనము ॥

2. పొలము దున్నగ రైతన్న హలము పట్టి
మహిని ఆహార మందించు మనకు నెపుడు
ఇలను సంస్కరించగ కవి కలము పట్టి
మెదడుకు పదును పెట్టంగ మేత పెట్టు

3. తెలుగువారు మరువలేని వెలుగు వారు
నాటి కలలోని మాటలు నాల్కనుండు
పాత్రలన్నియు మన చుట్టు పరగుచుండు
దైవ మందించె వారిని దివ్యముగను



# షిరిడీ

సాయినాథుని నమ్ముచు శరణమన్న
సర్వమును తానె చూచును శాశ్వతముగ
కీర్తి సంపద లిచ్చును ఆర్తి దీర్చు
ఆయురారోగ్యములనిచ్చి ఆదరించు.

ఆ దేవుడు ఆదిమధ్యాంత
రహితుడూ నమ్మకముంచి ఎవరు
దేవుణ్ణారాధిస్తారో
వారే ఆస్తికులు

ప్రజలలో ఆస్తికులు అధికం
ఐతే దేశానికి క్షేమం
నాస్తికులు ఎక్కువైనప్పుడు
దేశానికి క్షామం

# డ్యూటీ

తన డ్యూటీ ముగించుకుని వెళ్ళిపోతున్న
అతనినే చూస్తూ మూతి ముడుచుకుంది 'పంకజం'
కట్టుకున్న పచ్చంచు ఎఱ్ఱ చీరతో పోటీ పడుతూ
ముఖం మరీ ఎఱ్ఱగా చేసుకుంది 'సంధ్య'
తననే అంటి పెట్టుకుని ఉండాలనే తాపత్రయంతో
ఉదయాన కట్టిన నీలి చీర తర్వాత
తెల్ల చీర అలా రంగులు మారుస్తూనే ఉంది 'ఉష'
ఎవరు ఏమనుకుంటున్నా
తన డ్యూటీ తనదే అంటాడు సూరీడు

# వివాహము

పిల్లకి వచ్చింది పెళ్ళీడు
తండ్రికిని వరులవేట మొదలు
అమెరికా అబ్బాయి ఐతే
మరీ మంచిది అంటూ
అమ్మాయితో సహా సిద్ధం
వారంలోపే చెయ్యాలీ
వెంటనె పిల్లని పంపాలీ
అంటే సరే అంటారు

అమ్మడుకేమో ఆరాటం
తల్లికి తండ్రికి ఆర్భాటం
హడావిడిగ పెళ్ళి చేసేసి
ఊపిరి పీల్చుకుంటారు
కోరికలకు రెక్కలు వచ్చి
కలలుకంటూ విమానంలో
ఎగిరిపోతుంది ! కన్నవారు
ఉన్న ఊరు విడిచిపెట్టి

దూరమైన కూతురి సుఖమే
తల్లిదండ్రులు కోరుకొనేది
అల్లుని మంచిని నమ్మేదీ
బాధ్యత వదిలేసేది
భగవంతునిదే భారం అని
అదృష్టమంటే తమదే అని
మదిలోన నుప్పొంగి పోతూ
నిశ్చింతగా ఉంటారు

కాలం కలసి వచ్చిందా కథ
సుఖాంతం ! కాలం కాటేసి
అల్లుడే దుర్మార్గుడైతే
అమ్మాయి బలిఔతుంది
ధనదాహమునకు ఒకకన్యక
మగవాని అహంకారానికి
మరో యువతి ఆహుతి అగుటకు
వివాహము జూదమా ?



# ప్రతిన

1. ఆదిమధ్యాంతములు లేనిది
లంచగొండితనం ! దానికీ
మరొక పేరు అవినీతి ! దాని
ఆరాధకులే 'ఆస్తి'కులు

2. జనాభాలో అధిక శాతం వీరే
అందుకేనేమో నేడు మన
భారత మాతకీ సంక్షోభం
కలదా భవితకు క్షేమం ?

3. దేశ ప్రగతికి అవరోధకులు
ఆకలి కేకలకు కారకులు
ఆత్మహత్యలకు మూలములూ
ఈ అవినీతి కాముకులే ॥

4. అవినీతికి చాలా దూరం
అన్న ఆస్తికులైన వారు
వేయికొక్కరున్న చాలు నీ
దేశం బాగుపడుటకు ॥

5. బాపూజీ సత్యాగ్రహములే
పాఱద్రోలెను బానిసత్వమును
అవినీతిని అంత మొందించు
ఆ బాటనే అనుసరించు

5. అన్యాయముగా ఆర్జించమని
లంచం యిచ్చుట కూడ నేరమే
కనుక ఆ పని మేము చేయమని
ప్రతిన బూన వలెను ప్రతి ఒక్కరును ॥

# పసిడి నవ్వు

(అమెరికాలో మనుమడు)

1. చిన్నారి వంశీ లేస్తాడు అమ్మకన్నా ముందు
చిట్టి చిట్టి చేతులతో తట్టి తట్టి లేపుతాడు
శుభోదయం పలికినట్లు, పన్నీరు చిలికినట్లు
చిరుచిరు నవ్వుల పసిడి జల్లు కురిపిస్తాడు ॥

2. కేకలతో కేరింతలతో యిల్లంతా
సందడి నింపేస్తాడు, యింట్లో వాళ్ళంతా
తనతోనే ఆడి తీరాలంటూ
అందరికీ ఆనందం అందిస్తాడు ॥

3. అబ్బాయికి ఆటా పాటల చెలగాటం
ఆఫీసుకి టైమైందని అమ్మా నాన్నకి ఆరాటం
అయిష్టంగానే చెబుతుంటాడు టాటా
యింక తప్పదనుకుంటూ వింటాడు అవ్వ మాట ॥

4. పాలు త్రాగుతున్నా రైలు శబ్దం విన్నాడంటే
కాలు నిలవక పరుగులు పెడతాడు
అన్నం తింటున్నా ఆట్లాడుకుంటున్నా విమానం మోత
విన్నాడంటే నింగికేసి నిగిడి నిగిడి చూస్తాడు ॥



5. నిద్దురలో నైనా, కుక్కరు కూత వింటే చాలు
అదిరిపడి లేచి కూర్చుంటాడు
ఎప్పుడైనా మ్రోగే హెచ్చరిక అలారమ్
ఎప్పుడూ మ్రోగే టెలిఫోన్లకి చూడాలి అబ్బాయి హడావిడి ॥

6. అమ్మ గ్రైండరు వేస్తే, నాన్న వ్యాక్యూమ్ చేస్తే
అబ్బాయికెంతో యిష్టం, వాషింగ్ మెషీన్, మైక్రోవేవ్‌లూ
డిష్ వాషర్ల శబ్దాలంటే చాలా మోజు
కారులో షికారులు రోజువారీ రివాజు

7. టి.వి., సి.డి. ప్లేయర్లని పలికిస్తాడు రిమోటుతో
కారు గేరేజి ఓపెన్ చేయడం చూసి రిమోట్ మనుష్యులపై ప్రయోగిస్తాడు.
అన్ని రకాల శబ్దాలూ అబ్బాయికి నచ్చేవే.
కానీ, నచ్చునిది ఎవరైనా గట్టిగా నవ్వితేనే

8. మమతలూరేలా మనసు పొంగేలా
అందం చిందేలా అలుపు తీరేలా
నిర్మలంగా । నిష్కల్మషంగా ఉండి తనివి తీరేలా
బుగ్గల్లో గులాబీలు విరిసేలా నవ్వగల్గడం
పసిడి నవ్వులు విసరడం పసివారికే వరం ॥

# ప్రభోదం

అది కైలాసం
ఆది శంకరుని విలాసం ॥
నివసించేది హిమవన్నగం । చిత్రం ।
ధరించేది కరిచర్మాంబరం మాత్రం
శిరస్సు మీదనే ఉంటుంది గంగా జలం
ఫాల భాగాన ముక్కంట నుంటుంది అనలం
జటలోన అమృతాంశుని చల్లదనం
కంఠ మందున హాలాహలపు వెచ్చదనం
మెడలో పన్నగమే భూషణం
ఐనా వదనం ఎంతో ప్రసన్నం
సగభాగం పురుషాకృతి
పార్శ్వమంతా స్త్రీ ప్రకృతి
తన వాహనమైతే వృషభం
అర్ధాంగి వాహనం సింహం
కుమారుడెక్కేది మయూరం
ముద్దు గణపతి యెక్కేది మూషికం
అన్నింటనూ ఉన్నది వైవిధ్యమే
కాని, కానరా దెక్కడా వైరుధ్యం
భిన్నత్వంలో ఏకత్వం
అదియే ఈశ్వర తత్వం
అది అంతా ఏలిక సామర్ధ్యం
దానికందరూ కావాలి సంసిద్ధం
ప్రజలలో ప్రబలే అభిప్రాయ భేదం
ప్రగతికి కారాదు అవరోధం ॥
పరమత సహనం ఉండాలి
మమతా, సమతా, అభిమతం కావాలి ॥
అదియే విశ్వశాంతికి విశ్వేశుని ప్రబోధం ॥



# సమస్యాపూరణం

సమస్య : రణము గాంచి పిరికి రాజు మురిసె

ఆ. వె.

పూరణ : రాజు చూసె శంకరాభరణమ్మును
అలిగి బుసను కొట్టు ఆలి యందు
అపర సత్యభామ అనదగు భార్య చ
రణము గాంచి పిరికి రాజు మురిసె ॥

సమస్య : దయ రేఖలు దోచుచుండె ధవళారుణిమన్

పూరణ : దయగనవే యనుచు సజల
నయనమ్ముల వేడినరఘు నందనుడేనా
భయమును దీర్చు తరి శుభో
దయ రేఖలు దోచుచుండె ధవళారుణిమన్

ఒక మిత్రురాలు

ముత్యాలు జాలువారు ముచ్చటైన నవ్వు
పగడాల పేరువలె నుండు పలుకరింపు
కపట మెరుగని కనులు మర్మమెరుగని మనసు
చెలిమి కోరదగు స్నేహమయి యామె ॥

అవినీతి

అడుగు అడుగునా లంచం
విచక్షణన్నది లేకుండా
నీతి, నియమం అనకుండా
తినేది, తిరిగేదే అవినీతి

# ఉగాది

29-3-98, బందరు.

ఉగాది । నవయుగానికి నాంది
మన భవితవ్యానికి పునాది ॥ఉ॥
ఈశ్వర 'నామ'కు ఇదే మా వీడుకోలు
'బహుధాన్యకు' రావమ్మా అని వేడుకోలు ॥ఉ॥
వసంతాగమనం - మరాళమందగమనం
మధువనం - అడుగడుగునా నందనం
వసంతం నవశోభను తెచ్చిందీ
తొలి వెలుగులు విరజిమ్మిందీ ॥ఉ॥
మామిడిపూత పూసింది - మల్లియ విరిసిందీ
క్రొత్త చిగురు తిని కోకిల కూసింది
నెత్తావి తెమ్మెరల చిలకమ్మ మురిసింది
ప్రకృతి పులకించింది - చిరుజల్లులు కురిసిందీ ॥ఉ॥
విరికన్నియల సొగసు - సతత హరిత సోయగం
కనులకు విందు కలిగిస్తూంటే
కలకలరవముల విహంగములు
వివిధ గతుల వీనుల విందుచేస్తున్నాయి ।
నూతన వర్షోదయం
జనావళికి హర్షోదయం
మన కంతా జయం జయం
బహుధాన్యతో పంటలు బాగా పండాలని
మనకలల పంట కనుల పంట కావాలని
భరతమాత నిండుగ నిత్యం నవ్వాలని
ఆశిద్దాం । నవ్యపథంలో పయనిద్దాం ॥



# చక్రభ్రమణం

వర మందు రందరు సంతతిన్
బొందుట అబ్బాయి కలిగితే
అపరిమితమైన ఆనందం
అమ్మాయైతే పరిమితం

ఆడా మగ వివక్షకు అదియె
ఆరంభం । ఐనా చివరకు
కడుపుతీపిదే గెలుపూ
ఇరువురు సములని తెలుపూ ॥

తల్లి దండ్రులు తమనే మఱచి
పిల్లల కొఱకే జీవించీ
విద్యాబుద్ధుల ముద్దుగ బెంచీ
తృప్తిని పొందుచు నుంటారు

ఎదిగిన పిల్లలా ముచ్చట్లూ
చూడాలంటూ । కూతురి నొక
అయ్యచేతికి । కొడుకును ఓ
అమ్మడికీ అప్పగిస్తారు ॥

అంతటితో వారి బాధ్యతల్
తీరును । వీరికి మొదలౌను
తెలుసుకొనగ జీవన సారము
ఇదియే చక్రభ్రమణం ॥

## నూతన సంవత్సర శుభాకాంక్షలు

1. స్వాగతము ! నవ వసంతమా ! స్వాగతం ॥
చిత్రభాను సిరులందించువేళ ॥స్వా॥

నవ వసంతానికి నాందిగ నుండేవి
లేతనౌ మామిడి పూత లౌను
మత్తుగ మదిలోన మధురిమ నింపేవి
'కూ' యను కోకిల కూత లౌను
ముందుగ ముంగిట ముద్దుగ నిలిచేవి
విరబూసిన తరులు, విలువలొసగు
పుడమికి తొలకరి పులకింత లుండేవి
చైత్రమ్ము చైతన్య చిహ్న మౌను
ప్రస్తుత వాతావరణము, కల్మషముగుటను
పన్ను పెరిగి ప్రజల వెన్నువంగుటయును
అన్నిధరలు నాకాశము నంటుటయును
పోయినపుడు గద ఉగాది మోదమగును.
అందుకే

2. స్వాగతము నవవసంతమా స్వాగతం
చిత్రభాను సిరులందించువేళ ॥స్వా॥

ఆహ్వాన మంటాము ఆనందముగ నేడు
ఆశతో నుంటాము అందరమును
అల్లకల్లోలాలు అగుపించ నటువంటి
సంతోషమయమైన సహజశైలి
సాఫీగ జీవితం సాగునట్లు విధిని
వేడుకుంటా మింక వినయముగను



తే॥ గీ॥ విస్మరింతుము వృషనామ విలయమంత
కలత చెందిన మనసుల బలము చేతి
కలసి కట్టుగ కృషిజేయ కలుగు శుభము
చెడును చెఱపి మంచిని పెంచు చిత్రభాను ॥స్వా॥
ప్రకృతియె చేసిన ప్రళయ తాండవమద్ది
విప్లవ కారుల విలయకేళి
వెఱపి యీ వృష నామ వర్షమై వెలసెనో
ప్రజలంత వణికిరా ప్రజ్ఞ జూసి
చీకటి చిమ్మిన జీవితాలకు చిత్ర
భానూదయంబున భాగ్యరేఖ
వెలుగు నందించును । వెలికి దీర్చుననుచు
భావించుటె మనకు భావ్యముగును
మతము పేరిట మౌఢ్యము గతము కన్న
మిన్న నైదోచు అవినీతి మిన్ను నంటు
కన్నులున్న కబోదులై కలవరించు
ఖలుల నెదిరించి సాధించవలెను ప్రగతి ॥స్వా॥

# నేటి మహిళ

1. ఈ రోజు మహిళా దినోత్సవమని మగువా, గుర్తించు
అతివ హృదయ మీనాడు ఆనందంతో నర్తించు
ప్రస్తుతము అది ఈనాటికే మాత్రమే వర్తించు
తక్కిన రోజులు తగినన్ని బాధ్యతలు భరించు ॥

2. కూతురై తల్లి తండ్రులకు సహకరించు
భార్యగా భర్తకు తన చేయూత నందించు
అవసరమైతే ఆర్థిక సమస్యల నధిగమించు
అంతటనూ తానై అందరినీ అలరించు ॥

3. సంసారంలో సరిగమలు పలికించు
పిల్లలను, పెద్దలను ప్రేమతో పరికించు
బంధు మిత్రులను చక్కగ సంభావించు
ఇల్లు దిద్దుటనే తాను ఇష్టమై వరియించు

4. ఒడిదుడుకులకు ఓర్మి వహించు
సమయోచిత సలహాల నందించు
సతిగా పతితో సమానత్వము ఆశించు
అవసరమైన సమర శంఖారావం పూరించు

5. ఇంటి గౌరవం యినుమడింపచేయ నూహించు
ఉవిద ఉద్యోగ పర్వమంటూ ఉద్యమించు
సమస్య లెదురైతే శాంతముగా పరిష్కరించు
సమాజంలో తనకో విశిష్ట స్థానం కల్పించు ॥

6. మహిళా లోకంలో చైతన్యం కల్గించు
అన్ని రంగాల్లో అభివృద్ధిని అభిలషించు
అందులకై అహర్నిశలూ అబల శ్రమించు
అనుకున్నది తప్పక తరుణి సాధించు ॥



# సంపద

1. సాహిత్య మంటే
కొందరికే లభించు
సంపద ఐతే
సాహితీ మైత్రి
అందరికీ లభించు
భాగ్యమనంటా ॥

2. మిత్రత్వమంటే
ఏక త్రాటి మీదను
నించోడం ఐతే
అందరు కల్సి
అనుకున్న దానిని
సాధించటమంటా ॥

3. ప్రోత్సాహమంటే
ఇతరులకి మనం
ఇచ్చేది ఐతే
సమయానికి
నిరాశావాదికది
టానిక్ అంటా

4. ఉత్సాహం అంటే
మనసులోనిది ఐతే
ఉపకారము
చేసినపుడు వచ్చే
ఉల్లాసం అంటా

5. ఆదర్శం అంటే
అందరిలో గణన
కెక్కుటే ఐతే
అందరూ తన
అడుగులో అడుగు
వేయటం అంటా ॥

# తరుణోపాయం

సీ॥ తన పేగు త్రెంచుకు తనయుడు జన్మించ
తల్లి మురిసిపోవు తన్మయమ్ము
ఆట పాటలతోను అలరించు బుడతడిన్
అక్కున జేర్చుకు నాదరించు
చిలిపి యల్లరి జేయు చిన్నారి నెప్పుడు
చీదరించక తాను చిచ్చి కొట్టు
పెంకి తనము జేయ ప్రేమగా బాలుని
మందలించునె గాని మథనపడదు

తే॥ గీ॥ కాని పెండ్లైన పిమ్మట కన్నతల్లి
తల్లడిల్లు బిడ్డ కఱకుతనము జూచి
నాటి దూకుడె గాని యీ నాటి భార్య
కతనగాదె ? మిగిలె ప్రశ్న గతము నుండి ॥

తే॥ గీ॥ కోరి తెచ్చుకొనిన కొమ్మ కోడలమ్మ
కొడుకు సౌఖ్య సంతోషాలె కోరు అమ్మ
కోడలు, తనయన్ సమదృష్టి చూచునమ్మ
అదియె నద్వైతమై జెల్లు నవని సుమ్మ ॥

తే॥ గీ॥ తల్లి వలె యత్తను తలచు తరుణమందు
అత్త కోడళ్ళు ఆదర్శ పథము నడువ
సుఖము శాంతి యింటనె యుండు సొగసులొప్ప
పడతులకు సత్య జీవన పథము గనుడు ॥



# పాపాయి

(టి.వి.లో చూపిన యధార్థ గాథకు స్పందన)

అవ్వ నడచి పోవుదారిలో
అకట ! గమనించె వింత గొలుప
పొత్తి గుడ్డలందు పసిగుడ్డు
గుక్కపట్టి ఏడ్చుచుండ
తనకు దూరముగా నున్న తన
మనుమ అందరూ కనుల ముందు
కదల సాగి రొక్క సారిగా
మనసు కరిగె వృద్ధ మాతకు
బిడ్డ నెత్తుకుని గుండెలకును
హత్తుకొనుచు ఇంటికి తెచ్చెను.
ఆదరమ్ము నాలన పాలన
చూడ సాగినది అవ్వ
ఇల్లా ! అయ్యవారి నట్టిల్లు
తను దూర కంత లేదు గాని
మెడ కొక డోలు అన్నారంతా
అవ్వ వీడలేదు పాపను
ధనము కన్న హృదయమ్ము మిన్న
జాలి చూపక విడిచెను తల్లి
జాలితో పెంచె మరో తల్లి
ముద్దు గొల్పింది పాపాయి.

# స్వర్ణాంధ్ర

(ఆంధ్రరాష్ట్రావతరణ దినోత్సవం, రాంచి 2000)

సీ॥ ఆంధ్రావని మనకు అవతరించిన రోజు
ఆంధ్రు లానందించు నట్టి రోజు
గట్టి పట్టును బట్టి పొట్టి శ్రీరాములు
సాధించి పెట్టిన స్వర్ణదినము
ఆశీస్సు లందించు ఆ కీర్తి శేషుడు
జయమని పలుకంగ జగతి నేడు
పయనించ మనమంత ప్రగతి పథంబున
ఆనంద మొందు నా అమరజీవి

తే॥ గీ॥ ఐకమత్యంబె సాధ్యంబు అగును మనకు
ఉద్ధరించంగ రాష్ట్రము నున్నతముగ
వివిధ రంగాల నూతన విధములన్ని
మేళవించి కృషిని చేయ మేలు కలుగు ॥

సీ॥ పుణ్య క్షేత్రంబులు పుణ్య తీర్థంబులు
తేజరిల్లగ జేయు తెలుగుదనము
పారెడు నదులును పాడి పంటల శోభ
కోనసీమను పొంగు కోటి సిరులు
కమనీయ కావ్యాలు ఘనమైన శిఖరాలు
కడునింపు సొంపుగ కళను గూర్చు
శరవేగమున వెల్గి శాస్త్ర విజ్ఞానంబు
తెలుగు తల్లికి దెచ్చు జిలుగు వెలుగు

తే॥ గీ॥ అన్నిటను మిన్న మన యాంధ్ర యనగ జనని
జన్మభూమి యంచు తలచి జనులు కులము
మతము లను మౌఢ్యముల వీడి మనిన యపుడె
కలుగు సుఖశాంతులు మనకు తెలుసుకొనగ ॥

తే॥ గీ॥ ఆంధ్ర యని తెలంగాణ యంచని విభజన
పోరి పొందుట కన్నను పొత్తు మిన్న
ముదమున తెలుగు తల్లి తామదిని పొంగ
పొంద గావలె స్వర్ణాంధ్ర నందముగను

జై! ఆంధ్రమాత!



# మరో బుద్ధుడు

(T.V. 9 లో చూసిన యధార్థ సంఘటనకు)

ఆనాడు

మహరాజు శుద్ధోధనుడు తన
యిల్లాలు నిండు చూలాలూ
కోరిక తీర్చగా నెంచియూ
పంపెను పరివారముతో

పురిటి కొఱకు పుట్టినింటికిని
పయనమాయెను పట్టపు రాణీ
మాయాదేవి అమితమైన
ఆనందముతో

లుంబినీ వనమందు నామెకు
కానలోనవె కాన్పు జరిగెను
అవనిలో నను అవతరించెను
కారణ జన్మడు బుద్ధుడూ

ఈనాడు

తెలంగాణా ప్రాంతమందున
ఆలినీ తోడ్కొనిపోయెనూ
పురిటి నొప్పులు పెచ్చుకాగను
ఆ పతి ధర్మాసుపత్రికి

ధర్మమే లోపించె నచ్చట
ధనమె ప్రధాన మయ్యెను। దయకు
తావే లేక బీదరాలికి
అందనే లేదట వైద్యము

ఆ జనారణ్యము నందునా
సాటి వారు సహకరించగ
తెరల మాట నా నడి రోడ్డూ
పైన కాన్పయ్యెను కాంతకు

ఈనాడీ స్త్రీ దుస్థితికిది
పరాకాష్ఠ ఇక ముందైనా
అబల గౌరవం దక్కేనా
మానవత మిగిలేనా ॥

# ఇందిరమ్మ

వందనం । అభివందనం । ఇందిరమ్మకు వందనం
సుందరవదనకు - సాహసేందిరకు ॥వం॥
స్వాతంత్ర్య సమరాన మేటి
భారతావని తనకు తానె సాటి
రాజకీయ రణరంగానికి రాణి
ప్రజలకు ప్రియమైన దీమె వాణి ॥వం॥
అలుపెరుగని ఆదర్శమూర్తి
అకుంఠిత దీక్షా స్ఫూర్తి
నవ చైతన్యం - దేశభక్తి
మనలో కలిగించిన స్త్రీ శక్తి ॥వం॥
చతురత నీ నేల నేలిన నేత
మన చాచా నెహ్రూ వంశ సంజాత
భారత మాతకు ముద్దు బిడ్డ
గాంధి తాతకు గారాబు బిడ్డ ॥వం॥
దేశం కోసం అసువులు బాసి
అందరి మనసుల్లో నిల్చిందీ
యశస్సు నెంతో పొంది
అమరజ్యోతిగా వెలిగింది ॥వం॥

(అంతర్జాతీయ మహిళా వారోత్సవములలో)



# ఆగమనం

రాంచి - 1995

అదిగో । అదిగో । ఆమని అరుదెంచింది
ఆనందం ఆర్ణవమై అలరించింది
ఆంధ్ర ఆంధ్రేతర జనావళి
చేరినా రిచ్చట భళి భళి ॥
భాషా భేదములు లేవు
తరాల అంతరాలు అసలే లేవు
అనుబంధం ఆత్మీయతలే
సమైక్యతా సరాగమాలలై
స్నేహ సౌరభాలు వెల్లి విరిసె
ఈ సహవాసుల - వదన కుసుమాలు ॥ఆ॥
లేత మామిడి పూతలా ? అవి? కావు
పసిపాపల పసిడి నవ్వులు
అలకోయిల కూతలా ? అవి । కావు
కోమలీ కోమల గళరవములు
సరస సంభాషణా సరిగమలు ॥ఆ॥
నూతనోత్తేజము నీ నవ యువాబ్ది
ప్రగతి పథగామియై ప్రజ్వరిల్లు
అరయ నమృత వర్షిణిగా
హర్ష మందించు నీ వర్షమందు ॥ఆ॥

## దొంగాట

వీరి వీరి గుమ్మడి పండూ
వీరి పేరెవరు ?
'అవినీతి'
అవినీతీ ! పారిపో
అది ఎక్కడికీ పారిపోదు
కాషాయపు ముసుగుల్లోనో
ఖాకీ దుస్తుల్లోనో దాక్కుంటుంది.
పట్టబోతే ఒక పట్టాన దొరకదు.
తెల్లకోటు, నల్లకోటు అన్న తేడా లేదు.
కాలేజీ, కాటేజీ, మేరేజి ఐనా ఫరవాలేదు
అన్నింటా అవినీతి పదఘట్టం
సదరు ఇమేజి నేలమట్టం
ఉద్యోగం కావాలంటే
ప్రమోషన్ రావాలంటే
ట్రాన్స్ఫర్ చెయ్యాలంటే
ఏపని కావాలన్నా
కరెన్సీ కురిపించాల్సిందే
ఆ అవినీతి రక్కసికి
భోజనశాల రాజకీయ రంగం
నర్తనశాల క్రీడారంగం
పెన్షనర్ బ్రతికున్నాడనడానికి లంచం
చనిపోతే ధృవీకరణ పత్రానికి లంచం



భూములూ, ఇళ్ళూ రిజిస్ట్రేషన్లు
సుఖమైన ప్రయాణాల రిజర్వేషన్లు
అన్నింటికీ చెల్లించాలి ముడుపులు
అడిగేవాడికి ఇచ్చేవాడుండాలి
లంచం ఇవ్వడం భారమే కాదు
చాలా పెద్ద నేరము కూడా
అందుకే
అవినీతిని నిర్మూలించడాన్కి ముందు
లంచం యివ్వడం మానేయడమే మందు
అవినీతిని వ్యతిరేకిస్తూ
సత్యాగ్రహములు చేపట్టు
నీ ఆగ్రహమును చూపెట్టు
అవసరమైతే
కత్తిని పట్టు - లేదా కలమును పట్టు
కానీ ఆ అవినీతి దొంగాట నరికట్టు

# మనిషిలో మనిషి

(జరిగిన సంఘటన చూసినాక)

రైలు స్టేషను విశ్రాంతి గదికి
వచ్చారమ్మా అబ్బాయి, అమ్మాయి
ఒరకినొకరు వీడి ఉండలే
మంటూ ఒకటే ఊసులు

ఆహా ! అనుకూల దాంపత్యం
అనుకుందాం ఆలుమగలని
అంతలోనె వచ్చిన రైల్లో
పుట్టింటి కెళ్ళిం దమ్మాయి

భార్యని పంపి వచ్చిన మగడు
ఎదురు చూడసాగా డక్కడే
అపు డొచ్చిందొక వన్నెలాడి
ఛంగున గెంతెను అబ్బాయి

చెట్టాపట్టా లేసుకునీ
ఖుషీగా వారు వెడుతుంటే
ఏం మనుషులో అనుకుంది
ప్రత్యక్ష సాక్షి సీలింగ్ ఫ్యాన్ ॥



# ఇంతీ విలాపం

ముక్కుపచ్చలారని పసికందు
పదునారేండ్ల పరువాల పడతి
మధ్య వయస్కురాలైన ప్రౌఢ వనిత
కొండొకచో వయసు మళ్ళిన మగువ ।

ఏ దశనైనా స్త్రీ జాతికి తప్పదు దుర్దశ
మనువాడిన మగవాడు
మంచివాడైతే సరే
అలా కాక శాడిష్టు ఐతే ఉరే
ఆనాడు, ఈనాడు, ఏనాడూ
ఆడదంటే అలుసేనా ?

స్కూలు కెళ్ళిన బాలిక గ్రహచారం
ఉపాధ్యాయుడే చేసిన అత్యాచారం ।
కాలేజీలో హత్యకాబడిన విద్యార్థిని
కారణం। విఫల ప్రేమికుడైన సహవిద్యార్థి ।
అధికారుల దౌష్ట్యానికి బలి అవుతున్న ఉద్యోగిని
కట్నపిశాచానికి ఆహుతి అవుతున్న అభాగిని

ఏ వార్తలు చూసినా ఏమున్నది గర్వకారణం ?
భారత స్త్రీ దుస్థితికి కాదా దర్పణం ?
నేడు పెళ్ళి కానట్టి తల్లులు
కనబడుతున్నారు కోకొల్లలు
తస్కరింప బడుతున్నారు తరుణులు
పెరిగిపోతున్నారు వ్యభిచారిణులు
యిదియే యిదియే మన ప్రతాపం
నేటి భారత నారీ పరితాపం
యిది ఇంతి విలాపం

# ఉదయ నడక

॥ గీ॥ 1. ఉదయ నడకయె । మనలను ఉద్ధరించు
నడక ఉత్సాహ భరితము । నలత బాపి
మానసిక శాంతి నిచ్చును । ఘనముగాను
ఆయురారోగ్యములు పెంచు । అదియె మనకు ॥

నలుగురు కలసి క్రమముగ నడచినపుడు
ఐక్యమత్యమ్మె పెరుగును । ఒకరికొకరు
తోడుగా కష్టసుఖముల । వీడకుండు
నాణ్యతను పెంచు నయముగ నడకమనకు ॥

సులభ మార్గమ్మెన । శరీర బలము వచ్చు
బద్ధకము పోవు । వికసించు బుద్ధి బలము
శక్తి యుక్తులు పెరుగ । నైశ్వర్యమదియె
వృద్ధి చెందు । విధిగ జేయు డుదయ నడక ॥

# పొదరిల్లు

॥ గీ॥ 1. అందమైనదా యిల్లు । ఆనంద నిలయ
మగును । లక్ష్మీ సరస్వతుల్ । మక్కువ గొన
ఇంటి వారి వైభవమంత । యినుమడించె
తలుచునా దంపతుల్ । స్వర్గ ధామముగను ॥

తీరుగా ముంగిటన్ ముగ్గు తీర్చియుండు
పిల్లగాలుల తలలూపు పూలచెట్లు
ఎంతొ కనువిందు కలిగించి చింతబాపు
పిల్లపాపల తోడ వారెల్ల రుండె

పరుల కుపకార మన్నచో పరుగులిడుచు
స్వార్థచింతన లేకుండ సౌమ్యముగను
వారు నాదర్శప్రాయమై వరలుచుండ
ఊరి వారందరును మెచ్చు వారినెపుడు ॥



# సునామీ ఉప్పెన

తే॥ గీ॥ ఉప్పెన వలన ప్రజలకు ముప్పు వచ్చె
కానరాని విధమ్మున కడలి పొంగి
నవ్వుచున్ వచ్చి నా వారి నివ్విధంబు
అల్ల కల్లోలమును జేసె అలిగె నేమొ ॥

2. పున్నమని యా కుటుంబము పున్నెమనుచు
సంద్రమందున స్నానము సలుపువేళ
కడలి మ్రింగెను భర్తను కనులముందె
పిల్లలును నామె మిగిలిరి భీతి గొనుచు ॥

3. తనయుడొకడు సంద్రమునకు తల్లికోర్కె
తీర్చనెంచి తోడ్కొని పోయె । తీరమందు
మునిగి పోవు తల్లిని ఆదుకొనగ లేక
దుఃఖ సాగరమ్మున తాను త్రోయబడెను ॥

4. సాగర విహార యాత్రకు । సంతసముగ
స్కూలు పిల్లలతో చేరె మేలు బస్సు
అలల ఉధృతమ్ము ముంచియు ఆపదగన
పిల్ల లందరు బస్సులో గొల్లుమనగ ॥

5. తల్లి కళ్ళముందర బిడ్డ వెళ్ళిపోయె
బిడ్డలెదుట తల్లియు తండ్రి వెడలినారు !
ఆప్త లందరు నంబుధి నస్తమించ
అలమటించిరి మిక్కిలి ఆర్తితోడ

6. ఎంతయో విషాదమ్మును వింతయైన
సంఘటనలకు జనఘోష సంద్రఘోష
కన్నమించె । జలధి భూమి కంపనమ్మె
కారణమ్మ ! పాపము ? శాపకారణమ్మ ?

7. మృతులు ముప్పది వేలును । మృతసమాను
లెందరినొ మిగిల్చె సునామి । ఎందు చూడ
నందె ఘోర విషాదము । కుందె భరత
ఖండము ప్రకృతి విలయంపు తాండవమ్మ

# కాశీ - ప్రయాగ

సీ॥ వారణాసీ పురవాస । విశ్వేశ్వరా
నీదు దర్శనమౌట నాదు వరము
పావనమైనట్టి భాగీరథిని మున్గి
పుణ్యాఫలమ్మును పొందవరము
అన్నపూర్ణమ్మను ఆ విశాలాక్షిని
కనులార గాంచుట కాదెవరము
కాలభైరవు గవ్వలమ్మకుమ్రొక్కగ
కామిత మీడేర గలుగ వరము

తే॥ గీ॥ స్నానఘట్టమ్ములందుండు సందడెంతొ
గంగ నా మణికర్ణికా ఘట్టమందు
మనిషి అంతిమ యాత్రకు మరలుచోటు
పాప సంహార మగుటయె పరమవరము ॥

తే॥ గీ॥ గంగ, యమునా, సరస్వతీ సంగమమ్ము
స్నాన మాడుట మిక్కిలి సంతసమ్ము
ఈ త్రివేణిలో ఈడేరు ఈప్సితమ్ము
మాధవుడు ప్రయాగను చూపు మహిమ నమ్ము ॥



# కన్నయ్య

ఓ కన్నయ్యా నిన్ను
వెన్నదొంగవని అంటారే
మన్ను తిన్నావనీ అంటారే
చిన్ననాటనే శత్రువులను
మిన్ను నంటగా తన్నా వంటారే
అమ్మకు నీ ఆస్యంబున
విశ్వమంతను చూపితి వంటారే
కాళీయుమదమును
అణిచితివట
గోపాలకుడవనీ
గోవర్ధనమును
చిన్నివేలుతో ఎత్తితివని అంటారే ॥
ఇంతుల వలువలు
దాచితివనీ
అన్నులమిన్నుల కన్నులలో
కాపురముందువని అంటారే ॥
నీవు ఎందైనా వుందువని
అందుకు సందేహం వలదని
నమ్మినవారి మనసులే
నీకు నెలవని అంటారే ॥
కుబ్జకు రూపము ఇచ్చితివని
మామ కంసుని చంపితివని
నీకు యమునా తీరమూ
మురళీ గానము ప్రీతి అంటారే
కుచేలుడైనను
కుబేరుడైనను
నీకు సమానమని అంటారే
అసలున్నావా కన్నయ్యా ।
ఉంటే నామొర వినవయ్యా ।
వినగరావయ్యా । కన్నయ్యా ॥

# సంక్రాంతి

సీ॥ సంక్రాంతి మనకెంతొ సంబరాలను దెచ్చు
ముంగిట ముత్యాల ముగ్గులుండు
భోగిమంటలు వేయ ప్రోగౌను బాలలు
గొబ్బిళ్ళు శోభతో కొలువు తీరు
కంటికిం పగునట్టి గంగిరెద్దాటలు
సన్నాయి పాటలు మిన్నుముట్టు
బొమ్మల కొలువుల కొమ్మలందరు గూడి
క్రొత్త బట్టలు కట్టి కులుకుచుండ్రు

ఆ॥ వె॥ మకర సంక్రమణము మనమేలు పండగ
పంట లంద రైతు పంటపండు
సంతసమ్ము కలుగు సంసారమందున
లక్ష్మి తాండవించు లక్షణముగ ॥

తే॥ గీ॥ ఆయురారోగ్య సంపద లవని కలిగి
పరుల కుపకారములు చేసి ప్రణతులంది
శాంతి సుఖములు జీవన సరళి కలిగి
పండుగల శుభాకాంక్షలు పదులవేలు